# నాగార్జున కొండ


రచయిత :

**మారేమండ రామారావు, యం. ఏ., పిహెచ్. డి.**

చరిత్రాచార్యుడు - నిజాంకళాశాల

ఉస్మానియా విశ్వవిద్యాలయము, హైదరాబాదు





అజంతా





ప్రచురణ

# పీఠిక

బుద్ధభగవానుడి ధాతువుమీద నిర్మించబడిన మహాచైత్యము బోధిసత్వ నాగార్జునుడు నివసించిన శ్రీపర్వతమూ, కళాపిపాసువు సమ్యక్సంబుద్ధపాదభక్తులూ అయిన ఇక్ష్వాకురాజపుత్రికలు తయా చేయించిన లోకోత్తరశిల్పాలూ, ఇక్ష్వాకు చక్రవర్తుల రాజధాని అయి విజయపురీ గల నాగార్జునకొండలోయ ఆంధ్రులందరికీ పుణ్యస్థల 1926 నుంచీ యిక్కడ జరుగుతూన్న ఖననపరిశోధనకి ఫలితం ఇక్కడ ఎన్నో అద్భుతములైన అవశేషాలు వెలికి వస్తున్నాయి.

నాగార్జునసాగరకట్ట నిర్మాణం పూర్తి అవడంతో ఈలో యావత్తూ కృష్ణాజలంలో లీనం అయిపోతుంది. ఆ మీద ఈ పుణ్యస్థల "కలలోని వార్త" అయిపోతుంది. ఈలోగానే ఇక్కడికి యాత్ర చే ఈ పుణ్యస్థలాన్ని దర్శించి ఆంధ్రులంతా తమ విధిని నిర్వహించాలి

ఈ లోయనిగురించిన వివరాలు ప్రభుత్వంవారి ప్రచురణలలో ఉన్నవి. అవి సామాన్యులకి అందుబాటులో లేవు. ఈ పుణ్యక్షేత్రాని చూడబోయేవారి ఉపయోగార్థం ఈ చిన్నపుస్తకం వ్రాయబడింది. దీనిలో నాగార్జునకొండ ప్రాముఖ్యం సంగ్రహంగా చెప్పబడింది. ఇక్క శిల్పాల ఫొటోలు కొన్ని పుస్తకం చివర వేయబడినవి మిగతవి ఎక్క లభిస్తాయో సూచించబడింది.

ఈ గ్రంథం విషయమై ఆసక్తిచూపి, దీనిని చక్కగా ముద్రించి అజంతా ప్రచురణాధిపతులకు నా కృతజ్ఞత.

ఈ పుస్తకం ఆంధ్రలోకం యొక్క ఆదరాభిమానాలని పొం తుందని నేను ఆశిస్తున్నాను.

హైదరాబాదు
10-12-1955

మారేమండ రామారావు

సుప్రసిద్ధమైన బౌద్ధతీర్థం ఒకటి ఉండేది. ఇక్కడ అంతకుపూర్వమే బుద్ధుడి ధాతువుమీద నిర్మించబడిన మహాచైత్యం ఉండేది. అది ఖిలం అయిపోతే ఇక్ష్వాకురాజులకాలంలో దానిని జీర్ణోద్ధారం చేసి, దానికి చక్కని శిల్పాలుగల చలవరాతి పలకలు మలిచారు. చైనా, సింహాళం మొదలయిన దూరదేశాలనించి అనేకమంది బౌద్ధులు ఇక్కడి తీర్థాన్ని దర్శించడానికని యాత్రలు చేశారు

ఈ విధంగా చెట్లుచేమలతోటీ, వన్యమృగాలతోటీ భయంకరంగా ఉంటూవచ్చిన ఈనాగార్జునకొండలోయ ఒక్కసారిగా తన పూర్వవైభవాన్ని బయలుపరచింది. ఇక్కడికి దగ్గరలోనే నందికొండవద్ద ప్రభుత్వంవారు కృష్ణకి అడ్డంగా ఒక కట్ట నిర్మిస్తున్నారు. దీనికి ఫలితంగా కృష్ణనీరు పైకి ఎగతన్ని నాగార్జునకొండ, లోయ యావత్తునూ ముంచివేస్తుంది. అందుకని ప్రభుత్వంవారు ఈలోయ అంతటా ఖననపరిశోధన సాగించి ఇక్కడి ప్రాచీనావశేషములనన్నిటినీ బయటికి తరలించడానికి ప్రయత్నం చేస్తున్నారు.

౨

# నాగార్జునుడు, నాగార్జున కొండ

ఈ నాగార్జునకొండలోయలో కృష్ణఒడ్డున నాగార్జునకొండ అనే పేరుగల పెద్దకొండ ఒకటి ఉన్నది. ఈ కొండకి ఈ పేరు నాగార్జునుడనే వ్యక్తినిబట్టి వచ్చి ఉంటుంది. ఈ కొండకి ఈపేరు చిరకాలంనించీ ఉంటూ వస్తూన్నది. అందువల్ల నాగార్జునుడి సంబంధాన్నిగురించి ఇక్కడ సంగ్రహంగా చెప్పడం ఉచితం.

బౌద్ధుల వాఙ్మయంలోనూ, గాథలలోనూ నాగార్జునుడి పేరు తరుచుగా కనిపిస్తుంది. ఈ ప్రశంస చైనా, టిబెటుదేశాలలో ఎక్కువగా ఉన్నది. నాగార్జునుడనే పేరుగల వ్యక్తులు ఇద్దరు ఉండేవారు. అందులో ఒకనాగార్జునుడు క్రీ. శ. 2వ శతాబ్దిలో ఆంధ్రసాతవాహనచక్రవర్తి అయిన యజ్ఞశ్రీ సాతకర్ణి సమకాలికుడుగా వుండేవాడు. రెండవ నాగార్జునుడు క్రీ. శ. 6వ శతాబ్దిలో ఉండేవాడు. ఇద్దరూ ఆంధ్రదేశంలో బౌద్ధమత ప్రచారం చేశారు.

మొదటి నాగార్జునుడు నాగార్జున బోధిసత్వుడనీ, నాగార్జున పూస అనీ చాలా ప్రసిద్ధి కెక్కాడు. విదేశాలలో ఈ మహనీయుడు బుద్ధుడి తరువాత మళ్ళీ అంతటి వాడని కీర్తి చెందాడు టిబెటుదేశంలోని ఒక గాథననుసరించి ఇతడు శ్రీపర్వతముమీఁద నివసించినట్లు తెలియవస్తుంది. ఈ శ్రీపర్వతమనే పేరు నాగార్జు

కొండకి వర్తిస్తుంది. అందువల్ల నాగార్జున బోధిసత్వుడు ఈ కొండమీద నివసించడంవల్లనే ఈ కొండకి నాగార్జునకొండ అనే పేరు వచ్చింది అని నిర్ణయించవచ్చును.

ఈ నాగార్జునుడు విదర్భదేశంలో జన్మించిన బ్రాహ్మణుడు. మహామేధావి అయిన ఇతడు బాల్యంలోనే సర్వశాస్త్రములను అభ్యసించి, హేతువిద్యలోనూ, ఇంద్రజాలంలోనూ నిపుణుడు అయాడు. యౌవనంలోనే సన్యసించి ఇతడు దేశాటనం చేశాడు. హిమాలయాలలో ఒక ముసిలి భిక్షువువద్ద ఇతడు ఎన్నో మహాయాన బౌద్ధమత గ్రంథాలని చూచి, వాటి సారం గ్రహించాడు. ఆమీద నాగార్జునుడు సింహళద్వీపానికి పోయి అక్కడనించి మరి కొన్ని గ్రంథాలు తెచ్చాడు. వీటిలో చాలా గ్రంథాలమీద ఇతడు చక్కని వ్యాఖ్యానాలు వ్రాసి మహాయానమతం అందరికీ తెలిసే ట్టు చేశాడు. ఆమీద ఈ మహనీయుడు తన పాండిత్యాన్ని, ప్రజ్ఞనీ తోడుచేసుకొని మాధ్యమికవాదమూ, శూన్యవాదమూ అనే క్రొత్త సిద్ధాంతాలని ప్రతిపాదించి, ప్రచారం చేశాడు. అనేక మంది శిష్యులూ, ప్రశిష్యులూ ఈ సిద్ధాంతాలని దేశమంతా ప్రచారం చేశారు. ఈ ఆచార్యుడు వ్యాఖ్యానములుకాక 24 స్వతంత్ర గ్రంథాలు వ్రాశాడు.

నాగార్జునుడు కొంతకాలం కుషాను రాజైన హువిష్కుడి ఆస్థానంలో ఉన్నాడు. ఆమీద విదర్భలో ఒక సంఘారామంలో కొంతకాలం నివసించాడు. చివరకి కృష్ణాతీరాన వున్న శ్రీపర్వతం (నాగార్జునకొండ) మీది విహారంలో జీవితశేషం గడిపాడు.

ఈ బౌద్ధాచార్యుడు భారదేశపు తాత్త్వికులలో అగ్రశ్రేణికి చెందినవాడు. ఇతడు వైద్యశాస్త్రంలో మంచి ప్రావీణ్యం సంపాదించి సుశ్రుతమనే ఆయుర్వేదగ్రంథానికి వ్యాఖ్యానం వ్రాశాడు. ఇతనికి రసాయనశాస్త్రంలో చక్కని ప్రవేశం ఉండేది స్వర్ణయోగం కనిపెట్టి ఇతడు రాళ్ళను బంగారంగా మార్చాడట!

యజ్ఞశ్రీ చక్రవర్తి ధాన్యకటకం (అమరావతి) లోనూ, బోధిసత్వనాగార్జునుడు శ్రీపర్వతం (నాగార్జునకొండ) మీదనూ నివసిస్తూ, ఇద్దరూ మిత్రులై చాలా సన్నిహితులుగా ఉండేవారు. ఈ బౌద్ధాచార్యుడి ప్రేరణవల్లనే జగత్ప్రసిద్ధమైన అమరావతీ మహాచైత్యానికి లోకోత్తరములైన శిల్పములతో అలంకరింపబడిన ప్రాకారం నిర్మించబడింది.

ఈ విధంగా శ్రీపర్వతంమీద నివసించి బోధిసత్వ నాగార్జునుడు నాగార్జునకొండలోయనీ, యావదాంధ్రదేశాన్నీకూడా పవిత్రం చేశాడు.

3

# ఇక్ష్వాకు రాజులు

క్రీ శ 3వ శతాబ్దిలో నాగార్జునకొండలోయలోని విజయపురి రాజధానిగా సుమారు ఏభై సంవత్సరాలకాలం దక్షిణాపథ ప్రాగ్భాగాన్ని ఇక్ష్వాకువంశీకులైన రాజులు పరిపాలించి ప్రఖ్యాతులైనారు. వీరి పరిపాలనాకాలం ఆంధ్రదేశచరిత్రలో ముఖ్యమైనఘట్టం.

పురాణములలో ప్రాచీనరాజవంశముల ప్రశంస ఉన్నది. వాటిలో ఆయా రాజవంశముల పేర్లు, వంశముల క్రమమూ, ఆ వంశాలలోని రాజుల పేర్లూ, వారి పరిపాలనాపరిమితీ మొదలయిన అంశాలు ఉన్నవి ఇందులో ఆంధ్రరాజుల ప్రశంసకూడా ఉన్నది ఈ ఆంధ్రరాజులే సాతవాహనరాజులు. ఈ ఆంధ్రసాతవాహనవంశంలో ముప్పయిమంది రాజులు 450 సంవత్సరాలు పరిపాలించినతర్వాత క్రీ. శ. 218 ప్రాంతంలో వారి సామ్రాజ్యం అంతరించింది. ఆతర్వాత మరి 50, 60 సంవత్సరములకాలం అనేకరాజవంశములవారు సమకాలికులుగా పరిపాలించారు. ఇందులో కొందరు సాతవాహనుల కాలంనించీ ఉంటూ వచ్చారు. ఇట్లాంటి వారిలో ఆంధ్రభృత్యులూ, శ్రీపర్వతీయులూ ముఖ్యులు. ఈ రెండువంశాలవారూ ఆంధ్రులలోనివారే అని పురాణములలో చెప్పబడిఉన్నది. పురాణములలోని శ్రీపర్వతీయులే, శాసనముల

వల్ల తెలియవచ్చే ఇక్ష్వాకువంశీయులని చరిత్రకారులు నిర్ణయించారు.

ఇక్ష్వాకువంశం చాలా ప్రాచీనమైనది. వేదవాఙ్మయంలోనూ, పురాణములలోనూ ఈ వంశం ప్రశంస ఉన్నది. ఈ వంశపు రాజులు అయోధ్యా, మిథిలా, వైశాలీలవంటి కేంద్రాల నించి రాజ్యంచేశారు. ఈ వంశీకులు అనేకమంది దక్షిణాపథానికి వలస వచ్చి ఇక్కడ స్థిరపడి కొన్ని రాజ్యాలు స్థాపించుకున్నారు. వీరిలో కొందరు ఆంధ్రులలో కలిసిపోయి, క్రమక్రమంగా దక్షిణంగా వ్యాపించి, సాతవాహనసామ్రాజ్యం వైభవంగా సాగుతూన్న కాలంలో నాగార్జునకొండప్రాంతంలో స్థిరపడ్డారు. క్రీ. శ. 2వ శతాబ్దిలో ఈ వంశీకులలో కొందరు ప్రబలులై సాతవాహన చక్రవర్తులకు మహాతలవరు లనే పేర సామంతులుగా ఉండేవారు.

క్రీ. శ. మొదటి పాదాంత్యంలో సాతవాహన సామ్రాజ్యం క్షీణించింది. నాలుగవ పులోమావి అనే రాజు మరణించడంతో అది అంతరించింది. ఆమీద సామంతులు స్వతంత్రులయారు. రాజవంశంయొక్క వివిధశాఖలవారు ఎక్కడివారు అక్కడ స్వతంత్రులై, ఎవరికి దొరికిన భూమిని వారు ఆక్రమించి స్వతంత్రంగా పాలిస్తూ వచ్చారు. ఈ సమయంలో వాసిష్ఠీపుత్రచాంతమూలుడనే ఇక్ష్వాకువంశీయుడు విజృంభించాడు. సామంతమండలీకులు కొంతమందిని కూడగట్టుకుని ఇతడు దిగ్విజయం ప్రారంభించి, మిగిలివున్న సాతవాహన వంశీయులందరినీ జయించి స్వతంత్రరాజ్యస్థాపన చేశాడు.

ఇక్ష్వాకువంశంలో నలుగురు రాజులు స్వతంత్రులుగా పరిపాలన చేశారు. వారిలో మహారాజ వాసిష్ఠీపుత్ర చాంతమూలుడు మొదటివాడు. ఇతనిని మొదటి చాంతమూలుడనికూడా వ్యవహరిస్తారు. ఇతనికి చాంతిశ్రీ, హమ్మశ్రీ అని యిద్దరు సోదరీలు ఉండేవారు. ఈ రాజు భార్య మాఢరీదేవి. మొదటి చాంతమూలుడికి మహారాజ శ్రీవీరపురుష దత్తుడనే కుమారుడు, అడవిచాంతిశ్రీ అనే కుమార్తె ఉండేవారు. ఇందులో పురుషదత్తుడు ఉజ్జయినీరాజపుత్రిక అయిన రుద్రధరభట్టారికను, భటిదేవను, తన మేనత్తల కుమార్తెలు ముగ్గురినీ వివాహం చేసుకున్నాడు. ఇతనికి మహారాజ ఏహువుల చాంతమూలుడనే కుమారుడూ కొడబలిశ్రీ అనే కుమార్తె వుండేవారు. వీరిలో కొడబలిశ్రీ వనవాసిమహారాజును వివాహం చేసుకున్నది. ఇక్ష్వాకుల ఆడపడుచులు కొందరు ధనకులు, పూగియులు అనే తెగలవారికి కోడళ్లుగా వెళ్లారు. ఇక్ష్వాకువంశంలోని కడపటిరాజు శ్రీరుళపురుషదత్తుడు.

ఇక్ష్వాకువంశీయులు 100 సంవత్సరములు పాలించినట్లు కొన్నిచోట్లను, 52 లేక 50 సంవత్సరములు పాలించినట్లు కొన్నిచోట్లను పురాణములలో చెప్పబడి ఉన్నది. ఈ రెండు కాలపరిమితులూ సరియైనవే కావచ్చును. ఈ రాజుల శాసనములనుబట్టి వీరు 35 సంవత్సరములైనా పరిపాలించినట్లు తెలుస్తూంది. మొదటి చాంతమూలుడు ఎంతకాలం ఏలినదీ సరిగా తెలియదు. అతడు 15, 17 ఏళ్ళు పాలించి ఉండవచ్చును. ఇక మిగిలిన 50 సంవత్సరములూ ఇక్ష్వాకులు సాతవాహనులకు సామంతులై మహా

తలవరులుగా ఏలినకాలం కావచ్చును మొదటి చాంతమూలుడు క్రీ శ. 218–235 నడుమ, వీరపురుషదత్తుడు క్రీ శ. 235–255 నడుమ, రెండవ చాంతమూలుడు 255–266 నడుమ, రుళుపురుష దత్తుడు 266–270 నడుమ పరిపాలించినట్లు నిర్ణయించవచ్చును.

*మొదటి చాంతమూలమహారాజు :* ఇతడు మహావైభవంతో పరిపాలన చేసిన ప్రతిభాశాలి ఇతడు అశ్వమేధాగ్నిష్టోమ వాజపేయాగ్నిహోత్రము లనే యజ్ఞములను చేశాడు. అనేకకోటి గోదానములను[1] హిరణ్యహలశతసహస్రదానములను చేశాడు.[2] ఇతడు అప్రతిహతసంకల్పుడు మహాసెనుడనే కుమారస్వామి భక్తుడు. అశ్వమేధయాగం చేయడం చాలా కష్టసాధ్యం అయిన పని. అనేకమంది రాజులు తన అధికారానికి తలలొగ్గిన పరాక్రమశాలిగాని ఈ యజ్ఞం చెయ్యలేడు. అలాగే వాజపేయయాగం చేయడానికి ఎంతో అర్థబలం, అంగబలం కావాలి. ఈ యజ్ఞములు చేసి చాంతమూలుడు సమ్రాట్ సార్వభౌమ బిరుదులను వహించాడు.[3] నాగార్జునకొండలో దొరికిన ఒక స్తంభంమీద ఈ మహారాజు హిరణ్యదానంచెయ్యడం యజ్ఞములు చేసినతర్వాత ఊరేగడం శిల్పించబడినవి ఇతని రాజ్యం పశ్చిమోత్తరంగా ఉజ్జయినీ పాలకులయిన శకక్షత్రపుల రాజ్యంవరకూ, దక్షిణపశ్చిమాన వనవాసీపాలకులైన ఆంధ్రభృత్యుల రాజ్యంవరకూ వ్యాపించి ఉండేవి. చాంతమూలుడు మంచి రాజనీతి చతురుడు. ఇతడు తన సోదరి చాంతిశ్రీని పూగియులనే తెగకు చెందిన స్కందశ్రీకి, తన కూతురు అడవిచాంతిశ్రీని ధనకులనే తెగకు చెందిన స్కంద

విశాఖుడికీ వివాహము చేసి ఇరుగుపొరుగువల్ల ప్రమాదం రాకుండా చేసుకున్నాడు. నాసిక ప్రాంతంలో విజృంభిస్తూండిన ఆభీరులవల్ల ఏప్రమాదం రాకుండా వారికి పొరుగున రాజ్యం చేస్తూన్న శకక్షత్రవుల ఆడపడుచు రుద్రధరభట్టారిక అనే ఆమెను ఈ మహారాజు తనకుమారుడు శ్రీవీరపురుషదత్తుడికి పెళ్ళి చేశాడు ఈ విధంగా మహాప్రతిభాశాలి అయిన యీ మహారాజు దక్షిణాపథంలో ఏకైకసమ్రాట్టుగా వెలుగొందాడు.

*శ్రీవీరపురుషదత్తుడు :* ఇతడు తండ్రిఅంత ప్రతిభాశాలి కాకపోయినా తనకి సంక్రమించిన విశాలమైన సామ్రాజ్యాన్ని నిలవెట్టుకోగలిగాడు. తన తండ్రి చూపిన రాజనీతినే అనుసరిస్తూ యీ మహారాజు తన కుమార్తె కొడబలిశ్రీని వనవాసి మహారాజయిన శివస్కందనాగశ్రీకి ఇచ్చి వివాహం చేశాడు ఇతని ఆరవరాజ్యసంవత్సరంలో ఇతని మేనత్త చాంతిశ్రీయొక్క, ఇతరరాజవంశస్త్రీలయొక్క సహాయంతో నాగార్జునకొండలోయలో బుద్ధుడి ధాతువుమీద నిర్మించబడిన మహాచైత్యం చక్కని శిల్పఫలకాలతో కొత్తదిగా చేయబడింది. ఈ మహారాజు తన పదహారవరాజ్యసంవత్సరంలో తాను అంతవరకూ అవలంబిస్తూ వచ్చిన వైదికమతాన్ని వదలి[4] బౌద్ధమతాన్ని అవలంబించాడు[5] ఈ ఘటన నాగార్జునకొండశిల్పములలో చక్కగా నిరూపించబడింది.

*ఏహువుల చాంతమూలుడు :* ఇతడు పదకొండు సంవత్సరములు రాజ్యంచేశాడు. ఇతని కాలంలోకూడా విజయపురిలోని బౌద్ధ

తీర్థం బాగా వర్ధిల్లింది. ఇక్ష్వాకురాజవంశపు స్త్రీలు చాలామంది విహారాలనూ, మండపాలనూ కట్టించారు.

*రుళపురుషదత్తుడు :* ఇక్ష్వాకురాజులలో ఇతడు కడపటివాడు. ఇతని పరిపాలననిగురించి వివరాలు ఏమీ తెలియవు.

ఈ కాలంలో దక్షిణాన పల్లవులు విజృంభించారు. బహుశః వీరు సాతవాహనసామ్రాజ్యం దక్షిణసీమలో సామంతులుగా వుండి వుంటారు. ఈ పల్లవవంశీకుడయిన సింహవర్మ వనవాసి పాలకులైన ఆంధ్రభృత్యుల రాజపుత్రికను పెళ్ళి చేసుకొని ఆరాజ్యానికి ఏలిక అయాడు. అక్కడ నించి విజృంభించి అతడు దక్షిణంగా కంచివరకూ పోయి, ఆనగరాన్ని పట్టుకొని దానిని తనకు రాజధానిగా చేసుకున్నాడు. ఆమీదట సింహవర్మ ఉత్తరంగా దండెత్తి వచ్చి, ఇక్ష్వాకులనీ, వారి సామంతులనీ ఓడించి, వారి పరిపాలన అంతమొందించాడు. కృష్ణానదివరకూగల భూమిని అంతనీ జయించి, ధాన్యకటకంలో ఒక ప్రతినిధిని ఉంచి యీ మహారాజు యీ ప్రాంతాన్ని పరిపాలించసాగాడు. చరిత్ర ప్రసిద్ధమైన ఇక్ష్వాకుసామ్రాజ్యం ఈ విధంగా నశించిపోయింది.

1. Pl I
2 Pl II
3. Pl. III
4. Pl IV
5 Pl V

~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~

౪

## శాసనములు

నాగార్జునకొండలోయలో జరిగిన ఖననపరిశోధనలో కట్టడములతోటీ, శిల్పాలతోటీపాటు ఎన్నో శాసనములుకూడా దొరికినవి. ఈ శాసనములవల్లనే మనకు ఈ కట్టడములమ గురించీ, ఇక్ష్వాకురాజులని గురించీ ఆనాటి బౌద్ధమతాన్నిగురించీ వివరాలు తెలియవస్తాయి.

ఈ శాసనాలు చూడడానికి ముచ్చటగా వుండే లిపిలో వ్రాయబడినవి. ఈ లిపికి బ్రాహ్మీలిపి అని పేరు. ఈ శాసనాల భాష ప్రాకృతం. ఈ ప్రాకృతభాష సంస్కృతానికి చాలా దగ్గరగా వుంటుంది. ఈ శాసనాలలో సామాన్యంగా హ్రస్వాక్షరాలు ఎక్కువగా వుంటాయి. అలాగే ద్విత్వాక్షరాలకి బదులుగా రెండేసి అక్షరాలుఉంటాయి. (ఉ. శ్రీకి బదులు సిరి; స్తంభకిబదులుతభొ).

నాగార్జునకొండలో దొరికిన శాసనాలు **Epigraphia Indica** అనే పత్రిక XX వ సంపుటము 1-37 పుటలలోనూ, XXI వ సంపుటం 61-71 పుటలలోనూ, XXIX వ సంపుటము 137-139 పుటలలోనూ, నాగార్జునకొండసంచిక 32-34 పుటలలోనూ మూలపాఠములతోటీ, వ్యాఖ్యానములతోటీ ప్రకటించబడినవి. ఇవి మొత్తం 44 శాసనాలు ఉన్నవి.
~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~

ఈ శాసనాలు ఇక్ష్వాకురాజులలో రెండవవాడైన శ్రీవీర పురుషదత్తుడియొక్క, మూడవవాడైన ఏహువుల చాంతమూలుడి యొక్క పరిపాలనాకాలంలో వేయబడినవి. వీటిలో ఆయా రాజ్యసంవత్సరాలు, ఋతువులూ, పక్షాలూ చెప్పబడతాయి కాని ఏ శకమూ పేర్కొనబడదు.

శాసనములనించి ఎన్నో చారిత్రకాంశాలు తెలుస్తాయి. మొదటి చాంతమూల మహారాజు అశ్వమేధము, అగ్నిష్టోమము మొదలయిన యజ్ఞాలూ, గోహిరణ్యహలాది దానాలూ చేశాడనీ, అతడు కుమారస్వామి భక్తుడనీ ఇందుమూలంగానే తెలుస్తుంది పురుషదత్తుడు శకరాజుల అల్లుడనీ, అతని కూతురు వనవాసి రాజుభార్య అనీ శాసనాలవల్లనే తెలుస్తుంది. అలాగే యీశాస నాలు ఆనాటి బౌద్ధాన్నిగురించి వివరాలు తెలుపుతాయి ఇచ్చట అపరమహావినశైలీయులు, బహుశ్రుతీయులు, మహీశాసకులు అనే భిక్షుశాఖలవారూ, సింహళద్వీప భిక్షువులూ నివసించేవారని శాసనాలమూలంగానే తెలుస్తుంది. అలాగే ఇక్కడి కట్టడాలని గురించి వివరాలుకూడా వాటివల్లనే తెలుస్తాయి ఈ శాసనాలు దొరికివుండకపోతే ఈలోయలో బుద్ధుడి ధాతువుమీద నిర్మించ బడిన మహాచైత్యం వుండేదనీ, ఇక్కడి విహారాలు ఫలానా ఫలానా వ్యక్తులు కట్టించారనీ, నాగార్జునకొండకు శ్రీపర్వతమనే పేరు వుండేదనీ అనే వివరాలు మనకు తెలిసేవి కావు.

ఈ విధంగా ఇక్కడ లభించిన శాసనాలు చరిత్రరచనకి చాలా ఉపకరిస్తాయి.

(*12*) *మహాపరినిర్వాణం*[18] : అనేక ప్రాంతాలలో అనేక వేలమందికి తన ధర్మాన్ని బోధించి తన 80వ యేట బుద్ధుడు కుశీనగరము, రామగ్రామమూ అనే రెండు గ్రామాల సరిహద్దులో కొద్దిగా జ్వరం తగిలి పరమపదించాడు. ఆతర్వాత అతని శిష్యులు అతనిని ఒక చైత్యం రూపంలో ఆరాధించారు

## జాతకకధల శిల్పాలు

బోధిసత్వుడు సిద్ధార్థుడుగా అవతరించక పూర్వం ఎన్నో జన్మలు ఎత్తి ఎన్నో మంచిపనులు చేశాడట. ఈ పూర్వజన్మ వృత్తాంతాలకు జాతకములని పేరు ఇట్లాంటి జాతకకధలు కొన్ని వందలు ఉన్నాయి. ఇతరచోట్లవలెనే నాగార్జునకొండలోగల శిల్పాలలోకూడా జాతకకధలు శిల్పించబడినవి ఇక్కడ తొమ్మిది జాతకముల శిల్పాలు కనిపిస్తాయి. ఇవి యీ క్రింద సంగ్రహంగా వర్ణించబడుతున్నవి :

(*1*) *ఉమ్మగ్గజాతకం*[19] : బోధిసత్వుడు ఒకప్పుడు మహోసధుడనే పేరుతో ఒక వర్తకుడి కుమారుడుగా పుట్టాడు. చిన్నతనంలోనే మహామేధావి అని పేరు తెచ్చుకున్న ఇతనిని రాజు మంత్రిగా నియమించాడు. అదివరకే నలుగురు మంత్రు లున్నారు. వీళ్ళకి మహోసధుడిమీద అసూయ కలిగింది. అతన్ని ఎలాగైనా నాశనం చెయ్యాలని సంకల్పించి వారు నలుగురూ రాజుగారి ఇంటినుంచి కిరీటంలోని మాణిక్యమూ, కంఠాభరణమూ, ఉన్ని కంచుకమూ, బంగారు పాదుకలూ దొంగిలించారు. ఆతర్వాత

వీటిని తమ కానుకలుగా మహోసధుడి భార్య అమరకు పంపించారు. ఆమె భర్తను మించిన మేధావి. ఆమె ఈ వస్తువులలో దేనిని ఏమంత్రి పంపాడో ఋజువు సంపాయించి వుంచింది. ఈ మంత్రులు రాజుదగ్గరికి వెళ్ళి పోయిన వస్తువులు మహోసధుడి యింట్లో వున్నాయని చెప్పారు. రాజు మహోసధుడిమీద మండిపడ్డాడు. దీనితో భయపడి మహోసధుడు ఊరు విడి పారిపోయాడు. ఆమీద మంత్రులు అమరతో వినోదించాల ఒక్కొక్కరే ఆమె యింటికి వచ్చారు. ఆమె ఒక్కొక్క మంత్రికే తల గొరిగించి, ఒక చాపలో చుట్టబెట్టించింది. తర్వా ఆమె రాజుగారి వస్తువులతోటీ యీచాపచుట్టలతోటీ ఆస్థానా వెళ్ళి నిజం రుజువుచేసి తన భర్త నిర్దోషిత్వాన్ని స్థాపించింది.

(2) *చంపెయ్యజాతకం*[20] : ఒకప్పుడు బోధిసత్వ చంపెయ్యుడనే నాగరాజుగా అవతరించాడు. అతడు అప్పుడప్పు మనుష్యులతో కలిసి ఉపవాసాలూ, వ్రతాలూ చేసేవాడు. ఒకసా ఒక బ్రాహ్మణుడు మంత్రం వేసి యీ నాగరాజును కట్టేసి అ నే విధాల అతనిని ఆడించి డబ్బు సంపాయిస్తూవచ్చాడు. ఒకరో కాశీరాజు ఎదుట ఈ ఆట జరుగుతూంది. ఇంతలో నాగరాజుభార్య అక్కడికి వచ్చి కాశీరాజుతో తన భర్త వృత్తాంతం చెప్పి అతనిని విడిపించింది.

(3) *మాంధాతుజాతకం*[21] : బోధిసత్వుడు ఒకసారి మాంధాత అనే పేర ఒక రాజుగా జన్మించి గొప్ప చక్రవర్తి అయాడు. ఇక్కడ అనుభవించిన సుఖం చాలక అతడు స్వర్గానికి

వెళ్ళాడు. ఇంద్రుడు అతనిని గౌరవించి అర్ధరాజ్యం ఇచ్చాడు. ఈ రాజ్యం చిరకాలం పాలించాక మాంధాతకి ఇంద్రుడిని చంపి అంతరాజ్యమూ తానే ఏలాలనే దుర్బుద్ధి కలిగింది. వెంటనే అతనికి హఠాత్తుగా ముసలితనం వచ్చేసింది. కాని స్వర్గంలో ముసలితనం ముదరడానికి వీలులేనందున అతడు కింద భూమిమీద పడిపోయాడు అనుచరులు అతనిని పట్టుకుని శయ్యమీద వుంచారు. తర్వాత మాంధాత భూమిమీదా, స్వర్గంలోనూ కూడా లభించే సుఖం శాశ్వతం కాదనీ, దానికోసం ఆశపడవద్దనీ లోకాన్ని హెచ్చరించి మరణించాడు.

(4) *శిబిజాతకం*[22] : బోధిసత్వుడు ఒకసారి శిబిచక్రవర్తిగా జన్మించి గొప్ప దాత అని పేరు పొందాడు. ఒకప్పుడు ఒక గద్ద బారినించి తప్పించుకుని ఒక పావురం శిబిశరణు చొచ్చింది, గద్దరూపంలో వచ్చిన ఇంద్రుడు పావురానికి బదులుగా శిబిని ఎత్తుకు ఎత్తు తన మాంసం ఇయ్యమన్నాడు. శిబి తన మాంసం ఇచ్చి గౌరవం నిలుపుకున్నాడు.

(5) *మహాపద్మజాతకం*[23] : ఒకప్పుడు బోధిసత్వుడు మహాపద్ముడనే పేర కాశీరాజు కొడుకుగా అవతరించాడు. అతని తల్లి చనిపోగా తండ్రి మరియొక ఆమెను పెళ్ళి చేసుకున్నాడు. ఒకసారి రాజు యుద్ధానికి వెళ్ళాడు. ఈ సమయంలో సవతితల్లి యువకుడైన మహాపద్ముడినిచూచి మోహించింది. మహాపద్ముడు ఆమెని తిరస్కరించాడు. దీనితో అతనిమీద పగబట్టి అతని సవతితల్లి రాజు యింటికి రాగానే మహాపద్ముడు తనని బలవంతం

చేశాడని విలపించింది. ఉగ్రుడై ముసలిరాజు కుమారుడిని ఒక కొండమీదనించి కిందికి తోయించాడు. ఒక నాగరాజు అతనిని రక్షించి అర్ధరాజ్యం ఇచ్చాడు. ఏడాదికూడా గడవకుండగానే మహాపద్ముడికి వైరాగ్యం కలిగి, హిమాలయాలకి పోయి మునివృత్తి అవలంబించాడు. కొందరు రాజభటులు ఇతనిని ఆనవాలు పట్టి కాశీరాజుతో చెప్పారు. వెంటనే తండ్రివచ్చి ఇంటికి రమ్మని కొడుకును బతిమాలాడు. మహాపద్ముడు రానన్నాడు. ఆమీదరాజు తనని మోసంచేసిన రాణిని చంపించాడు.

(6) *ఘటజాతకం*[24] · ఈ జాతకంలో భాగవతంలోని కృష్ణుడి జనన వృత్తాంతం ఉంటుంది. కంసదేశానికి మహాకంసుడనే రాజు ఉండేవాడు. అతనికి కంస, ఉపకంస అని యిద్దరు కొడుకులూ, దేవగర్భ అనే కూతురూ ఉండేవారు. ఈమెకు పుట్టే కుమారుడు కంసవంశాన్ని నాశనం చేస్తాడని జోస్యం చెప్పారు పెద్దలు. కంసుడు రాజయాక చెల్లెలిని ఒక యింటిలో ఖైదుచేశాడు. ఇంతలో ఉపసాగరుడనే రాజపుత్రుడు ఇక్కడికి వచ్చాడు. ఇతడూ దేవగర్భా ఒకరినొకరు ప్రేమించుకుని, సేవకులని వశపరచుకొని తరచుగా కలుసుకునేవారు. వీరికి చాలామంది పిల్లలు కలిగారు. అందులో ఎనిమిదవవాడు కృష్ణుడు.

(7) *దీఘీతికోసలజాతకం*[25] : ఒకప్పుడు కోసలదేశానికి దీఘీతి అనేరాజు ఉండేవాడు. కాశీరాజు దండెత్తివచ్చి ఇతనిని తరిమివేశాడు. దీఘీతి భార్యతో కలిసి కాశీరాజ్యపు సరిహద్దులో ఒక పల్లెలో ఒక కుమ్మరి యింట్లో తల దాచుకుని కాలక్షేపం

చేస్తూ వచ్చాడు. అప్పుడు అతనికి దీర్ఘాయువనే కొడుకు పుట్టాడు. కొన్నాళ్ళకి కాశీరాజు దీఘితిని ఆనవాలుపట్టి అతనినీ, భార్యనూ చంపించేశాడు. దీఘితి తనకొడుకుకి "ద్వేషాన్ని ప్రేమతో జయించు" అని బోధించి మరీ పోయాడు. కొంతకాలానికి దీర్ఘాయువు కాశీరాజు కొలువులో చేరి, ఒకనాడు అతనిని చంపి పగ దీర్చుకోబోయాడు. ఇంతలో తండ్రి ఉపదేశం జ్ఞాపకానికి వచ్చి, తన వృత్తాంతం రాజుకి తెలియచేశాడు. కాశీరాజు ఇతనికి కోసల రాజ్యం ఇచ్చేశాడు.

## చారిత్రక శిల్పాలు

నాగార్జునకొండవద్ద దొరికిన కొన్ని శిల్పాలు ఇక్ష్వాకు రాజుల చరిత్రకి సంబంధించిన కొన్ని ఘట్టాలని నిరూపిస్తాయి. వాటిలో ఈక్రిందివి ముఖ్యములు :

(1) *చక్రవర్తి* : ఈ పేరువి రెండు శిల్పాలు ఉన్నవి. వీనిలో మధ్యన రాజు ఉన్నాడు. చుట్టూ అతని లాంఛనములు అయిన రాణులూ, మంత్రులూ, సేనాపతీ, చక్రమూ, కంఠాభరణమూ, ఏనుగూ, గుర్రములు మొదలైనవి ఉన్నవి. ఈ రాజు మొదటి ఇక్ష్వాకు చాంతమూలుడు.

(2) *శైవధిక్కారము* : ఇలాంటివి రెండు శిల్పాలు ఉన్నవి. వీటిలో ఒక రాజు కొందరు వ్యక్తుల యెదురుగా ఒక శివలింగాన్ని కింద పడదోసి, కుడికాలుతో త్రొక్కుతూ ఉన్నాడు. ఈ రాజు ఇక్ష్వాకులలో మొదటి వీరపురుషదత్తుడు.

(3) *యుద్ధము*: ఇది రెండుపక్షాలవారికి జరిగింది. ఒక వైపు ఏనుగులూ, గుర్రాలూ ఉన్నవి. రెండోవైపు సామాన్య ప్రజలు. ఇది వీరపురుషదత్తుడు ప్రజలతిరుగుబాటును అణచిన ఘట్టం.

(4) *బౌద్ధస్వీకారం*. ఇందులో ఒకవైపున రాజు శివ లింగాన్ని కాలితో త్రొక్కుతున్నాడు. రెండవవైపు అతడు బోధి సత్వుని కాళ్ళకింద కూర్చుని వున్నాడు. ఈ రాజున్నూ వీరపురుష దత్తుడే.

(5) *దానాలు*: ఒక స్తంభంమీద అయిదువరుసల శిల్పం ఉన్నది. అడుగువరుసలో బంగారపు ముద్దల రాశి ఉన్నది. దానిని ఒక రాజు ధారాపూర్వకంగా దానం చేస్తున్నాడు. పై వరుసలో రాజు ఏనుగుని ఎక్కి ఊరేగుతున్నాడు. ఇంకో శిల్పంలో రాజుముందు ఒక ఆవును నిలిపి అలంకరిస్తున్నారు. ఈరాజు మొదటి చాంతమూలుడు. ఈ దృశ్యాలు గోహిరణ్యాదానాలనీ, అశ్వమేధవాజపేయయాగాలనీ సూచిస్తాయి.

## వివిధ శిల్పాలు

వీటిలో అనేకము లున్నవి. అందులో బుద్ధపాదాలుగల పలక,[26] చైత్యం బొమ్మగల పలకలూ, సింహాలు త్రిరత్న చిహ్నాలుగల అంచుదూలాలు,[27] మాలాలంకారములుగల పలకలు, ఒక శకయోధుడి బొమ్మగల పలక, మిధునశిల్పాలూ ముఖ్యము లైనవి.

నాగార్జునకొండ శిల్పి మరి యితరచోట్ల శిల్పులు చూపించని విశిష్టమయిన పద్ధతిని బుద్ధజీవిత దృశ్యాలనీ, జాతక కథలనీ విశాలమైన ప్రదేశంలో చిత్రించి దృశ్యానికీ దృశ్యానికీ మధ్య కొద్దిపాటి జాగాలలో అత్యద్భుతమైన మిధునశిల్పాలని సృష్టించాడు అనేకమహాకవుల కావ్యములలో వర్ణించబడిన శృంగారభావాలకీ, నాయికానాయకుల చిత్తవృత్తులకీ మెరుగులు దిద్ది యీ శిల్పి వాటిని చలవరాతిలో ప్రతిబింబింపచేశాడు. ఇలాటి మిధున శిల్పాలు ఎన్నో వున్నవి. వాటిలో యీ క్రింది మూడు శిల్పాలూ ఎంతో హృద్యములుగా వున్నాయి.

(1) *మధుపాత్రసమర్పణం*[28] : ఒక ప్రియుడు చిరకాలం ఎక్కడనో వుండి తన ప్రియురాలివద్దకి వచ్చి, పూర్వం వలెనే ఒక పాత్రలో మధువుపోసి ఆమెకి ఇస్తాడు. అతడు దగ్గర లేనప్పుడుమధుపానం చేసే అలవాటు తప్పిపోయినందున ఆమె ముఖం ఒక వైపుకి తిప్పుకుంటుంది.

(2) *రాగోదయం*[29] : ఒక నాగుడు చిరకాలానంతరం ప్రియురాలివద్దకు వచ్చి వినోదభాషణాలతో కాలం వృథా చేస్తాడు. నాగినికి అంతలో రాగోదయం అవుతుంది. ఆమె తన చెవికి వున్న పద్మరాగాభరణాన్ని చూపించి తన రాగోదయాన్ని అతనికి సాంకేతికంగా సూచిస్తుంది.

(3) *నితంబాన్వేషణ*[30] : ఒక ప్రియుడు కుపిత అయిన ప్రియురాలి దగ్గరకు చేరి ఆమెకి రాగోద్దీపన కలిగించే నిమిత్తం అంగస్పర్శచేస్తూ వీపు నిమిరి, నడుము తడమవలెనని నత

మధ్యంలో ఎంతతడిమినా నడుము దొరకదు. అంతతో విసిగి అతడు చేతిని కిందికి పోనిచ్చి నితంబస్పర్శ చేసి కృతకృత్యుడు అవుతాడు.

8 Pl VII 9 Pl VIII 10 Pl IX
11 Arch. Sur Ind , Mem No 54 , Pl XXI a
12 Ibid Pl XXXII a 13 Pl X
14. Arch Sur Ind Mem No 54 , Pl XXII a
15 Pl XI 16 Pl XII
17 Arch Sur Ind Mem No 54 , Pl XXXII b
18 Pl XIII 19 Arch Sur Ind Mem No 54 Pl XXXVIII a
20 Ibid Pl XXXVIII b 21 Ibid Pl XXXIX a, b
22 Ibid Pl XLII a 23 Ibid Pl XLV b 24 Ibid Pl XLVI a
25 Ibid Pl. XLVII a 26 Pl XIV 27 Pl. XV
28. Pl XVI a 29 Pl XVI b 30. Pl XVI c

౭

# నాగార్జున సాగరము

భారతదేశాన్ని అతి తరచుగా పీడించే బాధలలో క్షామ బాధ చాలా ముఖ్య మయినది. పంటలు సరిగా పండక పోవడం వల్ల తగినంత ఆహారం దొరకక అనేకమంది బాధ పడుతూం టారు. మనదేశంలో ఆహారోత్పత్తి ఎక్కువ అయితేనే కాని మనకి క్షామ బాధ తప్పదు. పంటలు ఎక్కువ కావాలి అంటే ఇంతవరకూ బీడుపడి సాగులోకి రాకుండా వున్న భూమికి నీటి సదుపాయం లభించాలి. స్వతంత్రభారత ప్రభుత్వం ఈముఖ్య సమస్యని ఎదుర్కొనే నిమిత్తం అనేక (ప్రాజెక్టులు) ప్రణాళికలు తయారు చేసింది. ప్రస్తుతం అనేకనదులలో నీరు చాలాభాగం వృథాగా సముద్రంలోకి పోతూన్నది. ఈ నదులకి అడ్డకట్టలు కట్టి వాటిలో నీటిని నిలవ చేసి మెట్ట ప్రాంతాలకి మళ్ళించి వాటిని సాగులోకి తెచ్చే నిమిత్తం యీ ప్రణాళికలు ఏర్పడినవి.

ఆంధ్రదేశంలో కృష్ణాగోదావరులు ముఖ్యనదులు. వీటిలో చాలా నీరు వృథాగా పోతూన్నది. అందుకని ప్రభుత్వంవారు గోదావరికి అడ్డకట్ట కట్టి రామపాదసాగరం ఏర్పాటు చెయ్యాలనీ కృష్ణకి అడ్డకట్ట కట్టి నాగార్జునసాగరం ఏర్పాటు చెయ్యాలనీ సంకల్పించారు.

కృష్ణానదిలో ఎన్నో ఉపనదులూ, వాగులూ కలుస్తాయి ఒక్క బెజవాడ దగ్గరనే ఏడాది మొత్తం మీద ఎల్లప్పుడూ 1715 T. M C అడుగుల నీళ్ళు ప్రవహిస్తూంటాయి. ఈ నదికి సంబంధించి ఇదివరకే కొన్ని ప్రణాళికలు సాగుతూన్నవి. వీటి వల్ల ఉపయోగపడే నీరూ, ప్రస్తుతం ఉపయోగ పడుతూన్న నీరూ మొత్తం పోను ఇంకా 970 T. M. C. అడుగుల నీరు మిగిలి వృథాగా పోతూంది.

ఈ మిగిలే నీటిని ఉపయోగించే నిమిత్తం సిద్ధేశ్వరం, నందికొండ, పులిచింతల అనే చోట్ల నదికి అడ్డకట్టలు కట్టాలి అని ఒక పథకం ఉన్నది. సిద్ధేశ్వరంకట్టవల్ల 3.64 లక్షల ఎకరాల భూమినీ, నందికొండకట్టవల్ల 31.38 లక్షల ఎకరాలభూమినీ, పులిచింతల కట్టవల్ల మరికొన్ని లక్షల ఎకరాలభూమినీ సాగు చెయ్యడానికి సరిపోయే నీరు లభిస్తుంది. ఇది కాకుండా ఈ కట్టల వల్ల 175,000 K. W.ల విద్యుచ్ఛక్తినికూడా ఉత్పత్తి చెయ్య వచ్చును.

పైన చెప్పబడిన స్థలాలు అన్నిటిలోకీ నందికొండవద్ద కట్ట కట్టడం సుకరమూ, లాభదాయకమూను. నందికొండ అనే గ్రామంవద్ద నదికి అడ్డంగా కట్ట కడతారు. ఈ స్థలం అటు మాచర్లరైలుస్టేషనుకు 10 మైళ్ళదూరంలోనూ, ఇటు మిరియాల గుడా దేవరకొండ రోడ్డుకు 10 మైళ్ళదూరంలోనూ ఉన్నది. ఈ కట్ట 8,860 అడుగుల పొడుగు వుంటుంది. దీనిమూలాన కృష్ణా నది నీరు 110 చదరపుమైళ్ళదూరం ఎగువకి వ్యాపిస్తుంది. ఈనీటిని

నదికి కుడివైపున ఒకటీ, ఎడమవైపున ఒకటీ రెండు కాలువలు తవ్వి వాటిలోకి మళ్ళిస్తారు. కుడివైపున కాలవ 276 మైళ్ళ పొడుగు ఉంటుంది. దీనిమూలాన గుంటూరుజిల్లాలోని సత్తెనపల్లి నరసరావుపేట, ఒంగోలు తాలూకాలు పూర్తిగానూ, పల్నాడు, వినుకొండ, గుంటూరుతాలూకాలు కొంతవరకునూ, నెల్లూరు జిల్లాలో కందుకూరు, కొవ్వూరు, కావలితాలూకాలు పూర్తిగానూ, దర్శి, పొదిలి, కనిగిరి, ఉదయగిరి, ఆత్మకూరు తాలూకాలు కొంత వరకూనూ కర్నూలుజిల్లాలో కొద్దిభాగమూ సాగుబడిలోకి వస్తాయి ఎడమవైపు కాలవ 140 మైళ్ళ పొడుగు ఉంది హైదరాబాదు రాష్ట్రంలోని వరంగల్లు, నల్లగొండజిల్లాలలో కొంతభాగానికీ ఆంధ్రరాష్ట్రంలో కృష్ణాజిల్లాలోని నందిగామ తాలూకాకీ వ్యవసాయానికి నీరు అందిస్తుంది.

ఈ నందికొండ కట్ట కట్టడానికి తొమ్మిది సంవత్సరాల కాలం పడుతుంది. దీని నిర్మాణానికి 21.28 కోట్ల రూపాయలు ఖర్చు అవుతుంది.

ఈ కట్టవల్ల ఇప్పుడు బీడుపడివున్న భూమిలో కొన్ని లక్షల యెకరాల నేల సాగుబడిలోకి వస్తుంది. ఇందువల్ల ఎక్కువ ఆహారధాన్యాలు ఉత్పత్తి అయి కరువు కాటకాల బాధ చాలావరకూ తగ్గుతుంది. ఈ కట్టమూలంగా తయారయే విద్యుచ్ఛక్తివల్ల చాలాప్రదేశానికి దీపాలసౌకర్యమూ, పరిశ్రమలకి శక్తి సౌకర్యమూ, లభిస్తుంది. కాని దీనినిర్మాణంవల్ల ఆంధ్రదేశ చరిత్రకూ, ఆంధ్రదేశకళాచరిత్రకూ, ఆంధ్రదేశమతచరిత్రకూ

అతిముఖ్యమైన నాగార్జునకొండలోయ కృష్ణాగర్భంలో లీనమయిపోతూంది బుద్ధభగవానుడి ధాతువుమీద కట్టబడిన పవిత్రమహాచైత్యం మనకి కనుపించదు. బోధిసత్వనాగార్జునుడి విద్యాపీఠం కనుమరుగై పోతుంది. ఇక్ష్వాకు చక్రవర్తుల రాజధానిగా కీర్తి చెందిన విజయపురి అదృశ్యమైపోతుంది. ఈ పవిత్రనిర్మాణాలూ, స్థలాలూ భావుకులైన వారి హృదయఫలకాలమీదనూ, మనోవీధులలోనూ మాత్రం నిలిచి వుంటాయి.



Plate I.



మొదటి చాంలమూలుడు గోదానముచేయుట

Plate II.



మొదటి చాంతమూలుడు హిరణ్యదానము చేయుట

Plate III.



న్రపట ప్ చాంతమూలుడు, అతని ఏడు అలంకారములు

Plate IV.



పురుషదత్తుడు బ్రాహ్మణమతాన్ని నిరసించుట

Plate V



పురుషదత్తుడు బౌద్ధమతం అవలంబించుట

Plate VI.



బుద్ధుడి ధాతువుమీద నిర్మించబడిన మహాచైత్యము

Plate VII.



తుషితస్వర్గంలో బోధిసత్వుడు



బోధిసత్త్వుని అవతరణము

Plate VIII.

Plate IX.



బుద్ధ జననం

Plate X.



మహాభినిష్క్రమణం



ధర్మచక్రప్రవర్తనం

Plate XIII.



మహాపరినిర్వాణం

Plate XIV.



బుద్ధపాదాలు

Plate XV.



సింహాలు



త్రిరత్న చిహ్నలు

Plate XVI.



a మధుపాత్ర సమర్పణం



b (ఐష్మ)రాగ ప్రదర్శనం



c. నితంబాన్వేషణం



చెక్కవలసిన శిల్పపు ఆకృతిచిత్రం